

# శ్రీ రామకృష్ణ పరమహంస





# వారి హారతి పాట



(స్వామి వివేకానంద వారి రచన)

**ఖణ్డన భవబన్ధన, జగవన్దన వన్ది తోమాయ్**

**నిరఞ్జన, నరరూపధర, నిర్గుణ గుణమయ్ ॥**

సంసార బంధాలను ఖండించువాడా, లోకవందితా, నిను మేము ఆరాధింతుము. నర రూపమును ధరించి యున్నావు కాని, నీవు నిష్కళంకుడవు, గుణ రహితుడవు, గుణ మయుడవు.

**మోచన అఘదూషణ, జగభూషణ, చిద్ఘనకాయ్,**

**జ్ఞానాఞ్జన విమల నయన వీక్షణే మోహ జాయ్ ॥**

దోషముల నుండియు పాపముల నుండియు ముక్తినొసగువాడా, లోకాలంకారా, చిద్రూపీ, జ్ఞానాంజనముచే విమలమైన నీ చూపు ఒక్కటి చాలును, మోహమును పోగొట్టుటకు.

**భాస్వర భావసాగర చిర ఉన్మద ప్రేమ పాథార్**

**భక్తార్జన యుగళ చరణ, తారణ భవ పార్ ॥**

ఉజ్జ్వల భావ సముద్రుడా, ప్రేమసాగర చిరోన్మత్తుడా, నీ చరణ యుగళమును ప్రాపించిన భక్తులు భవసాగరమును దాటి గట్టెక్కుదురు.

**జృమ్భిత - యుగ - ఈశ్వర జగదీశ్వర యోగ సహాయ్**

**నిరోధన, సమాహిత మన నిరఖి తవ కృపాయ్ ॥**

యోగ సహాయుడవైన ఓ లోకేశ్వరా, ఈ యుగ స్వామివిగ అవతరించితివి, నిరుద్ధమై సమాధిలో నిమగ్నమైయున్న నీ మనస్సును నీ కృపచేతనే చూచుచున్నాము.

**భఞ్జన దుఃఖ గఞ్జన కరుణా ఘన కర్మ కఠోర్**

**ప్రాణార్పణ జగత తారణ కృన్తన కలి డోర్ ॥**

దుఃఖ వ్యధల భంజించువాడా, కరుణా స్వరూపీ, దుష్కర కార్యనిర్వాహకా, లోకరక్షకా, నీ ప్రాణమిచ్చి కలిబంధముల ఛేదింతువు.

**వఞ్చన కామ కాఞ్చన, అతి నిన్దిత ఇన్ద్రియ రాగ్**

**త్యాగీశ్వర, హే నరవర, దేహ పదే అనురాగ్ ॥**

కామకాంచన  ఆసక్తియు, అతినిందితమయిన యింద్రియ రాగమును లేని వాడా, విరక్త చక్రవర్తీ, పురుషోత్తమా, నాకు నీ చరణములందు భక్తి నొసంగము.

**నిర్భయ, గత సంశయ, దృఢ నిశ్చయ మానసవాన్**

**నిష్కారణ, భకతశరణ త్యజి జాతి కుల మాన్ ॥**

భయ సంశయ రహితుడా, దృఢ నిశ్చయ మనస్కుడా, నీవు భక్తుల జాతి కులాదులను పాటింపక వారికి అవ్యాజ శరణమువు అగుదువు.

**సమ్పద తవ శ్రీ పద, భవ గోష్పద వారి యథాయ్**

**ప్రేమార్పణ, సమదరశన జగజన దుఃఖ జాయ్ ॥**

నీ శ్రీ పాదమే మా సంపద, ఆ పాదమున ఈ సంసారము గోష్పదవారి పాటిదే. ఓ ప్రేమార్పణా, సమదర్శనా, నీచే జగజ్జనముల దుఃఖము రూపుమాయును.

**నమో నమో ప్రభు వాక్య మనాతీత మనో వచ నై కాధార్**

**జ్యోతిర జ్యోతి ఉజల హృదికన్దర తుమి తమో భఞ్జన హార్ ॥ ప్రభు ॥**

ఓ ప్రభూ! 'మనములందు చర్చించి భాషావళిం బలుకన్ రాని' వాడా, వాఙ్మనసైక భూమీ, పరంజ్యోతీ, హృదయ కుహరాంధకార భంజనా, నీకు వందనములు.

**ధే ధే ధే లఙ్గ రఙ్గ భఙ్గ, బాజే అఙ్గ సఙ్గ మృదఙ్గ**

**గాఇఛే ఛన్ద భకతవృన్ద, ఆరతి తోమార్ ॥**

ధే ధే ధే లంగ రంగ భంగ ధ్వనులతో సమ్మిశ్రమైన మృదంగ ధ్వానముతో నీ భక్తులు సాయం పూజాగీతమును పాడుచున్నారు.

**జయ జయ ఆరతి తోమార్ ॥**

**హర హర ఆరతి తోమార్ ॥**

**శివ శివ ఆరతి తోమార్ ॥**

**ఖణ్డన భవబన్ధన, జగవన్దన వన్ది తోమాయ్**

**జై శ్రీ గురు మహరాజ్ కీ జై !!**

సౌజన్యము : **శ్రీ రామకృష్ణ ప్రభ – మాస పత్రిక**

(దుర్ముఖి) 1957 మార్చి నెల (మాఘమాస) సంచిక